# కృతజ్ఞత

స్వర సంకల్పన సేయు డీ కృతికి
భావ జ్యోతి దీపింప సు
స్వర యుక్తంబుగ నంచు కోర
నిరపేక్ష స్నేహ విస్ఫూర్తిమై
పరమ ప్రీతి నొనర్చు 'కొప్పరపు
సుబ్బారావు' సాహాయ్యమున్
మరవన్ లేను కృతజ్ఞతా భర
సమాధ్మాతాంతరంగుండనై

—రంగకవి

# విషయసూచిక


| | |
|---|---|
| ప్రపంచ యుద్ధం | ౫ |
| మేలుకొలుపు | ౯ |
| అరుణ పతాకం | ౧౧ |
| వైతాళికం | ౧౩ |
| పార్టీ తత్వం | ౨౨ |
| యథార్థం | ౨౬ |
| ఫాసిస్టు దురంతాలు | ౩౧ |
| సోదరా | ౩౬ |
| ఐక్యప్రభావం | ౪౦ |
| స్వతంత్ర యుద్ధం | ౪౨ |
| యువకుడా | ౪౪ |
| ప్రతిజ్ఞ | ౪౬ |
| తారతమ్యం | ౪౭ |
| సోదరి | ౫౪ |
| ప్రబోధం | ౫౯ |
| స్వరములు | ౬౧ |

# ప్రపంచయుద్ధం

ప్రపంచయుద్ధం ప్రపంచయుద్ధం
తుపానువలె చెలరేగిందోయ్ !
ఇటలీ జర్మని అటువైపుననూ
బ్రిటిష్ ప్రభుత్వం ఇటువైపుననూ
ప్రపంచ యుద్ధం బ్రహ్మాండముగా
సామ్రాజ్యాశతొ సాగిందోయ్ !
సామ్రాజ్యాలకు సాగిందోయ్ !

నాజీ జర్మని నాయకత్వమున
అక్షరాజ్యములు భక్షించేశాయ్
చిన్న దేశముల నన్నీ వరుసగ :
మొదటి దెబ్బకే పోలండ్ బోణీ
నార్వేహాలెండ్ సర్వనాశనం
బెల్జ్యం డెన్మార్క్ బిస్మిల్లయ్యాయ్
ఫ్రాన్సు ప్రభుత్వం పాదాక్రాంతం
రాగా పోగా యూగోస్లేవియ
గ్రీసులు దెబ్బకు గిరగిర తిరిగాయ్
ప్రపంచయుద్ధం ప్రపంచయుద్ధం

## విప్లవజ్వాల

భయంకరంబుగ ప్రబలిందోయ్ !
ఫాసిజమంతట పాకిందోయ్ !

అప్పుడు ప్రజలకు అటు ఇటు ఒక టే
కావుననే మనకార్మికక రక్ష
విప్లవశ క్తిని పెంపొందిస్తూ
ఇరువురనూ మనమెదిరించామోయ్ !
సామ్రాజ్యాశకు సంతృప్తుందా ?
సామ్రాజ్యాశతో శాంతినిల్చునా ?
సామ్రాజ్యాశతో సంధికుదుకునా ?
సామ్రాజ్యాశలు చచ్చిపోనిదే
సర్వ దేశముల శాంతిభద్రతలు
శాశ్వతసౌఖ్యము సాధ్యంకావోయ్ !
స్వాతంత్ర్యాశలు సఫలంకావోయ్ !

ప్రపంచసౌఖ్య ప్రమాదకరమా
నాజీజర్మని నాయకత్వమున
"ఆంటీబోల్షివిక్" అంటు నియంతలు
సమస్తమానవ సౌఖ్యప్రదమా
రష్యాపై తమ రాక్షససైన్యం

## ప్రపంచయుద్ధం

ఒక్క పెట్టునే ఉరికించారోయ్ !
ఉడతూపులతో ఊగించారోయ్ !

ఇదే సమయమని ఇంగ్లండమెరిక
రష్యాతో త్రైరాజ్యసంధిలో
చేతులుకలిపీ చేరాయొకటిగ
రెండుపక్షములు మొండిపట్టుతో
ప్రచండయుద్ధం ప్రారంభించాయ్ !
ప్రజాశక్తులకు పనికల్పించాయ్ !

నాజీజంపై మోజుచూపుతూ
అక్షరాజ్యములు ఆపక్షంలో
ప్రజాప్రభుత్వం ప్రపంచ సౌఖ్యం
కూలీరాజ్యం కోరే రష్యా
ఆధిపత్యమున అమెరిక, కెనడా,
ఇంగ్లండ్, చైనా ఈ పక్షంలో
హోరాహోరిగ పోరుతున్నవోయ్ !
నాజీ జర్మని నాశన మగునోయ్ !

జపాను దేశపు తుపాను దెబ్బకు
మిత్రమండలికి మైత్రిదట్టమై

## విప్లవ జ్వాల

ఏకలక్ష్యముగ ఐకకంఠ్యముగ
సంకుల సమరం సాగిస్తుందోయ్ !
క్రూరనియంతల రూపుమాపునోయ్ !

రష్యాయుద్ధ ప్రారంభంతో
ప్రపంచయుద్ధం ఫాసిష్టులతో
ప్రజాయుద్ధముగ మారిందోయ్ !
ప్రజాప్రభుత్వం వస్తుందోయ్ !

ప్రజాయుద్ధమున ప్రవేశించుటే
సత్వరమార్గం స్వాతంత్ర్యానికి
స్వరాజ్యమప్పుడె సాధ్యంబగునోయ్
కావుననే మన కార్మిక కర్షక
విప్లవశక్తులు విజయవంతముగ
అక్షరాజ్యముల నంత మొనర్పగ
భారతదేశ ప్రజానీకమును
ప్రచండసేనగ ప్రవృద్ధిచేస్తూ
స్వదేశరక్షణ సాగించాలోయ్ !
స్వరాజ్యదీక్షను సాధించాలోయ్ ! !
స్వతంత్రభారత్ స్థాపించాలోయ్ ! ! !

జనవరి ౧౯౪౨

## మేలుకొలుపు

కాలమిదే లెండికఁ కార్మిక కర్షకులార !
భానిసత్వమిప్పుడే బాపుకోశక్తిలేదె ?
కాలమిదే లెండికఁ కార్మిక కర్షకులార !

పెట్టుబడి విధానమిటుల పీల్చిపిప్పి జేసెనిమ్మ
ఎంతకాల మింకమీరు హేయమైనజీవితమ్ము
గడపగలరుమీదుహక్కులకుగ వేగరండురండు
కాలమిదే ...

ప్రజలసేమ మరయురష్య ప్రబలతర విరోధితోడ
పోరుతున్నదోయి భరతవీరులార, మేలుకొనుడు
ఫాసిజమ్ము రూపుమాప బాసచేసి రండురండు
కాలమిదే ...

ఫాసిజమ్ముప్రబలితేనుప్రజలహక్కులకుగువట్టు
కార్యభారమూని వేగ కదలిరండు కదనభువికి
ఆలసించవలదు మీరు మేలుకల్గు రండురండు
కాలమిదే ...

మనస్వరాజ్యమెప్పుడైనమనమె తెచ్చుకొనగవలయు
ఫాసిజమును ప్రతిఘటించు ప్రజలయుద్ధమందు చేరి
భరతదాస్య బంధనాలు బాపవేగ రండురండు

కాలమిదే లెండికన్ కార్మిక కర్షకులార !
బానిసత్వ మిప్పుడే బాపుకో శక్తిలేదె ?
కాలమిదే లెండికన్ కార్మిక కర్షకులార !

ఫిబ్రవరి ౧౯౪౨

## అరుణపతాకం

అదిగో! అదిగో!! అరుణపతాకం
ప్రపంచకార్మిక భాగ్యనిధానం
సుత్తీ కొడవలి సుచిహ్నదీప్తం
అదిగో! అదిగో!! అదిగో! అదిగో!!
అదిగో! అదిగో!! అరుణపతాకం

కనపడలేదా కనుల పండువుగ?
అరుణపతాకపు టడుగున నిలిచీ
నాజీరాక్షసి నాడి నడల్చుచు
జనుల స్వతంత్రత సంరక్షించే
ఎర్ర సైన్య మదె ఎగురుచు పాడుచు
కనపడలేదా? కనపడలేదా?
కనపడలేదా? కనపడలేదా?
అదిగో! ...

వినపడలేదా వీనుల విందుగ?
అరుణపతాకపు టడుగున నిలిచీ
ఉద్ధృతసేనల నుద్బోధించే
సత్యవచస్కుడు శాంతమనస్కుడు

క్రామ్లేడ్ స్టాలిన్ గంభీరోక్తులు
వినపడలేదా? వినపడలేదా?
వినపడలేదా? వినపడలేదా?
అదిగో! ...

అగుపడలేదా అంబరవీథిని?
సంధ్యారాగ ఛ్ఛాయాసదృశం
ఫాసిజరాత్రి ప్రభాతతుల్యం
రష్యాకార్మిక రక్తస్నపితం
రష్యా బోల్షివిక్ రక్తపతాకం
అగుపడలేదా? అగుపడలేదా?
అగుపడలేదా? అగుపడలేదా?
అదిగో! ...

సెప్టెంబరు ౧౯౪౨

# వైతాళికం

భరతపుత్రుల వీరగాథలు
మరచినారా? లెండు లెండోయ్
చావలేదోయ్ భారతీయుల
శౌర్య ధైర్యములు

ఉడుకు రక్తము పొంగి పొరలును
ఒడలు వడివడి కంపమెత్తును
ఝాన్సిలక్ష్మిబాయి చరితము
జ్ఞప్తివారినచో

పారతంత్ర్యోచ్ఛేదమునకై
ప్రాణమొడ్డిన వీరభగవత్
సింగు స్వార్థత్యాగ మపుడే
గంగ గలిసినదా?

సమదశత్రుల నుగ్గునుగ్గుగ
సమరభూస్థలి సంహరించిన
ధీరచరితు శివాజితేజము
దీప్తి తరిగినదా?

ఆత్మదేశోత్కర్షరక్షణ
కాహావస్థలి నిల్చి గెల్చిన
హైదరాలీ, టిప్పు శౌర్యం
బస్తమించినదా ?

హిందు ముస్లిము సఖ్యమునకై
ఎన్నొకష్టము లనుభవించిన
అట్టి అక్బరు సౌహృదము నే
డగ్గి గలసినదా ?

స్వచ్ఛమా మీహృదయఫలకము
లందు ప్రతిబింబించలేదా
శౌర్యధనుడగు బాలచంద్రుని
సమర దృశ్యములు ?

శత్రురాణ్మత్తేభసింహా
స్వప్నసముడగు తాండ్రపాపయ
వీరహుంకృతి మేను పొంగగ
వినపడుటలేదా ?

రామరాజు విచిత్రతర సం
గ్రామచర్యలు జ్ఞప్తిలేవా?
అపుడె వాని యశఃప్రదీపిక
లారిపోయినవా ?

వీరయువకుల వేడినెత్తురు
వెల్లువగ ప్రవహించె నిచ్చట
ఇంతలోనే సాంద్రరక్తం
బింకిపోయినదా ?

తరతరాల విచిత్రగాథలు
తలపునకు స్ఫురియింపగానే
నింగికెగయును లేమెడంద వి
హంగభంగిమను

ఎందరెందరో త్యాగశీలురు
ఎందరెందరో వీరవనితలు
ఎందరెందరో దేశభక్తులు
ఇందు బుట్టిరిగా !

ఎంద రెందరో సత్కవీంద్రులు
ఎంద రెందరో యోగిచంద్రులు
ఎంద రెందరో పుణ్యమూర్తులు
ఇందు బుట్టిరిగా !

ఎంద రెందరో విశ్వకర్మలు
ఎంద రెందరో త్యాగరాజులు
ఎంద రెందరో రామమోహను
లిందు బుట్టిరిగా !

అట్టి పావనభరత దేశం
బన్యవశమైపోయె నెపుడో
దానిసలమై బాధ లెన్నో
పడుచునుంటిమిగా !

పరులదాస్యము చేయనోపక
బాధ లిక భరియింపనేరక
పారతంత్ర్యోచ్చాటమునకై
పోరుచుంటిమిగా !

అట్టితరి ఫాసిష్టుహంతకు
లాత్మదేశం బాక్రమించుట
ఔర! రోకటిపోటు కాదా
గోరుచుట్టుపయిన్ ?

ప్రజలమాడ్చు ప్రపంచశత్రువు
భరతభూమిని కొల్లగొట్టుట
భరతశౌర్యము బ్రతికియుండగ
జరుగనున్నదొకో ?

భారతావని గొడ్డువోవున ?
భరతపుత్రులు పందలవుదుర ?
వీరరక్తము నాళములలో
పారుచుండగనే ?

క్రూరులైన జపానుశత్రులు
కూర్మితల్లి పరాభవింతురు
రక్షణార్థము వీరులారా,
రండు తక్షణమే

అదిగో! వచ్చె జపానుఘాతుకు
లనుగు భారతి నాక్రమింపగ
విజయదుందుభి మ్రోగ వీరా
వేశమున రండోయ్ !

గీతమాలిక లల్లి యుష్మత్
గ్రీవసీమ నలంకరింపగ
వేచియున్నా రిదె కవీశులు
వేగ రారండోయ్ !

విజయమంగళ హారతులతో
వీరవనిత లొసంగ దీవన
వేచియున్నా రిదిగో వరుసగ
లేచి రారండోయ్ !

కదలిరండోయ్ కదనభూమికి
కార్యభారం బూని మూపున
విజయచిహ్నము లవిగో కననగు
వేగమే రండోయ్ !

# వైతాళికం

జననిభారతి రక్షణార్థము
జంకుగొంకూలేక ముందుకు
త్యాగమూర్తులు, దేశభక్తులు
తరలి రారండోయ్ !

మనకు దాస్యవిముక్తికోసము
మంచిమార్గం బొక్కటే యిది
వీరభారత పుత్రులారా,
వెడలి రారండోయ్ !

భరతయోధుల బొందిలోపల
ప్రాణి నిలబడు నంతకాలము
మాతృదాస్య ఋణానుబంధము
మరపురాదండోయ్ !

చావొ బ్రతుకో తేల్చుకొనియెడు
సమర మిదియే యోధులారా,
విజయలక్ష్మి పరిణయార్థము
వేడ్కమై రండోయ్ !

జయపతాకం ఎగురవేయుటో?
చచ్చి వీరస్వర్గ మేగుటో?
సక్రమంబగు మార్గ మొకటే
శౌర్యశాలురకు

పుట్టినప్పటినుండి భువిలో
గిట్టు తప్పక మర్త్యు డెపుడో
జననిదాస్యవిముక్తి కొరకగు
చావె మేలండోయ్!

శత్రువీరుల గుండె లవియగ
సమర విజయోత్సాహపరులై
ఖరతరాసి ధరించి కరమున
కదలి రారండోయ్!

వేగ నడువుడు వేలు వేలుగ
వీరయువకులు, వీరవనితలు,
వీరవృద్ధులు, వీరబాలురు
వీర ముఖ్యాంగణ

## వై తా ళి క ం

కదము త్రొక్కుచు, పదముపాడుచు
కదలి రండోయ్ భరతపుత్రుల
పౌరుషాగ్నిజ్వాల శత్రుల
భస్మ మొనరింపన్

కదము త్రొక్కుచు, పదముపాడుచు
కదలి రండోయ్ భారతావని
శాశ్వతంబౌ శాంతిసౌఖ్య
స్థాపనంబునకు

సెప్టెంబరు ౧౯౪౨

## పార్టీతత్వం

వ్రాతల చేతల బట్టే లోకం
పార్టీ తత్వం పరికిస్తుందోయ్ !

"ఫాసిజ మేమును ప్రతిఘటియిస్తాం.
స్వరాజ్య మేమును సంపాదిస్తాం"
ఈలా ప్రజలకు హితవులు చెపుతూ
ఇంతకు బాంబే ఏ. ఐ. సీ. సీ.
తీరా వింటే తేల్చిన దేమిటి ?
జాతీయైక్యత స్వార్థం కాదని
స్వరాజ్య మిస్తే స్వదేశరక్షణ
సాగిస్తా మని పరతువిధిస్తూ
కాదంటేమరి కలహాం నిజమని
కాంగ్రెసు ప్రముఖులు గర్జిస్తుంటే
స్వదేశ రక్షణ సాగే దెటులోయ్ ?
ఫాసిజ మెందుకు తోసుకురాదోయ్ ?

వ్రాతల చేతల బట్టే లోకం
పార్టీ తత్వం పరికిస్తుందోయ్

## పార్టీతత్వం

“ఫాసిజ మేమును ప్రతిఘటియిస్తాం
స్వరాజ్య మేమును సంపాదిస్తాం”
అన్నీ నిజమే అయితేగియితే
ప్రాణతుల్యమగు పాకిస్తానము
నామోదించగ నఖిలపక్షముల
హామీ నిమ్మని అడుగుటెకానీ
బాధ్యతనంతా పాలకవర్గం
పైనే వేసీ పాకిస్తానని
మాటిమాటికీ పాటపాడుతూ
ఐక్యముకోరకై యత్నమొనర్పక
జిన్నాసాహెబు చేతులుముడుచుక
ఉదాసీనుడై ఉపేక్షచేస్తే
జాతీయైక్యత సాధ్యం బెటులోయ్?
జాప్ల దోపిడి నాపేదెటులోయ్?

వ్రాతల చేతల బట్టే లోకం
పార్టీతత్వం పరికిస్తుందోయ్!

“జాతీయైక్యము సమకూడందే
స్వదేశరక్షణ సాగించందే

ఫాసిజ మెల్లెడ పరిమార్చందే
స్వాతంత్ర్యాశలు సఫలంకావోయ్ !
ప్రజాప్రభుత్వం ప్రాప్తంకాదోయ్ !"
అంటూ ప్రజలకు అపీలుచేస్తూ
కమ్యూనిష్టులు సమ్యక్పంథా
చూపిస్తుంటే చూడని వారికి
జాతీయైక్యము శక్యంబగునా ?
స్వదేశరక్షణ సాధ్యంబగునా ?
స్వరాజ్యదీక్షలు సఫలంబగునా ?
ప్రజా ప్రభుత్వం ప్రాప్తంబగునా ?

వ్రాతల చేతల బట్టేలోకం
పార్టీతత్వం పరికిస్తుందోయ్ !

జపాను రాక్షసి కుపయోగించే
అనర్థదాయక వినాశపద్ధతి
నిరాలస్యముగ పరిత్యజించి
అపాయకర మగు నౌదాసీన్యం
క్రియాశూన్యమగు వృథాప్రయత్నం

# పార్టీ తత్వం

సింహగర్జనలు చిటిపొటిమాటలు
వాగ్వాదాలకు స్వస్తిపలికించీ
సత్వరపూర్ణ స్వరాజ్యసిద్ధికి
జనని భారతిని సంరక్షించుట
అఖిల జనాచరణైక యోగ్యమని
క్రమశిక్షణతో .కార్యసాధనకు
నడుము బిగించీ వడి వడి రండోయ్ !

వ్రాతల చేతల బట్టే లోకం
పార్టీతత్వం పరికిస్తుందోయ్ !

సెప్టెంబరు ౧౯౪౭

# యథార్థం

స్వచ్ఛమౌ జాతీయసంస్థను
తుచ్ఛలౌ సామ్రాజ్యవాదులు
రెచ్చగొట్టీ దేశ మంతట
చిచ్చుబెట్టారు

దీనిచే నుద్రేకపూరితు
లైన మన జాతీయవాదులు
దొంగదెబ్బకు తారుమారై
లొంగిపోయారు

అందుచే సర్కారువలలో
అఖిలకాంగ్రెసు పక్షసభ్యులు
చిక్కుకొని మన దేశరక్షణ
పక్కకీడ్చారు

ఉక్కురోషము పట్టజాలక
పెక్కుసేయుచు నుండి రిప్పుడు
భారతావని రక్షణకు ప్రతి
బంధకార్యములు

## యథార్థం

ఇట్టి అల్లరి దేశరక్షణ
మట్టిచేస్తూ, ఏమెరుంగని
ప్రజల నెల్ల ప్రభుత్వహింసకు
బలిగ నిస్తుంది

ఇది స్వదేశానర్థకరమై
హేయమౌ ఫాసిస్టుజాపుల
దండయాత్రకు ధైర్య మిచ్చి
దారితీస్తుంది

ఇట్టిచర్యలు సరకు సేయక
గట్టిగా ఫాసిస్టుదుష్టుల
ముట్టడుల నరికట్టి వారల
మట్టిచేయాలి

దుష్టులౌ ఫాసిస్టుశత్రుల
దోపిడికి చేయూతనిచ్చును
పడుపుకూటికి పాలుపడియెడు
పంచమాంగదళాల్

ఈ యనర్థము కంత కాంగ్రెసు
హేతు వని సర్కారు చెప్పుచు
కాంగ్రెసును విచ్ఛిన్న మొనరుప
కత్తికట్టారు

ఈ ప్రభుత్వపు టెత్తు లన్ని గ్ర
హించి మన జాతీయవాదుల
విడువ తీవ్రతరోద్యమం బిక
నడుప బూనాలి

శ్యామ, బర్మా, మలయ పతన వి
షాద గాథలు తలచుకొంటే
దీనికారణ మేమొ తెలియును
తేటతెల్లముగా

ఏ ప్రభుత్వము గూడ తనప్రజ
హృదయపూర్వక సానుభూతి ల
భించకుండిన శత్రువుల నెది
రించలే దెవుడు

## యథార్థం

దేశరక్షణసూత్ర మొకటే
దేశభావిశుభోదయమ్మున
కాదికారణ మను సుభాషి
తక్షరాల నిజం

భరత జాతీయైక్యతకునై
ప్రబలయత్నము సేయగావలె
ఐక్యమే మన మాతృరక్షణ
కసలుదారి సుమా !

అప్పుడే మన దేశరక్షణ
అన్నిముఖముల సాగిపోవును
అప్పుడే ఫాసిస్టు దాడుల
నాపగల్గుదుము

అప్పుడే సామ్రాజ్యవాదం
బంతరించు ప్రపంచమంతట
అప్పుడే స్వాతంత్ర్యభానుం
డక్షిగోచరమా

అప్పుడే సిద్ధించు సామ్య గు
ణాభిషిక్త ప్రజా ప్రభుత్వం
అప్పుడే సుఖ శాంతి సంపద
లనుభవించెదము

సెప్టెంబరు ౧౯౪౭

# ఫాసిష్టు దురంతాలు

ఆక్రాంత రష్యాలో అన్నిప్రాంతాల
క్రూరులౌ నాజీల ఘోరకార్యాలు
ఇవియవి యని వేరె ఎన్నగానేల?
అత్యమానుష క్రూర కృత్యాలువేలౌ:
పట్టణమ్ములనెల్ల పాడుచేశారు
పాఠశాలలు మట్టి పాలుచేశారు
గ్రంథభాండారాలు కాల్చివేశారు
మ్యూజియమ్ముల మట్ట మొనరించినారు
కసిదీర యువకుల మసిజేసినారు
పరదాకు పిల్లల చంపేసినారు

పౌరుల యిండ్లలో బడి పట్టపగలు
బందిపోటులరీతి భయపెట్టి ప్రజల
ధనధాన్య సంపదల్ దాటేసినారు
కల్లబొల్లెరుగని గ్రామవాసులను
బలవంతముగ నిండ్ల బంధించివేసి
తలుపులు బిగియించి తాళాలు వేసి
ఆహుతిచ్చారండి అగ్నిదేవునికి

అసువుల నొక్కసారి హవ్యంబురీతి
అగ్ని వేల్చారండి ! అహాహా దుర్భరము !!

కండకావరముచే కామాంధులైన
కొల్లగొట్టె నాజి ఘోరరాక్షసులు
సాధ్వీ మతల్లులన్ జంకులేకుండ
హత్యలెన్నో చేసి అవమానపరచి
చెరచినారని వేరె చెప్పగానేల ?
వారు పెట్టేబాధ వర్ణింపలేము
వారి దురంతాలు వచియింపలేము
వారి దోపిళ్ళకూ మేరయేలేదు
వారి హత్యలజెప్ప నోరాడదండి
శ్వాపదమ్ములు వారు జనులపాలిటికి
పెనుభూతములు వారు పేదవారలకు
నరుల రక్తముద్రావు నాజీలమాట
స్మరియించరాదండి చల్లనివేళ

దొంగనాజీగుంపు కంగరక్షకులు
హాతక నాజీమూక నుగు నెచ్చెలులు
దుష్టులైన జపాను దోపిడిగాండ్రు

ఆక్రమించిన చైన అన్ని ప్రాంతాల
దుష్కృత్యములలోన దోపిళ్ళలోన
అన్నింట నాజీల కన్న లైనారు
ఆసుపత్రులపైన, అసహాయలైన
స్త్రీల, బిడ్డలపైన చిచ్చుబాంబులను
కుప్ప తెప్పలుగాగ కురిపించినారు
ఆడ మగ భేదాలు అణుమాత్రలేక
పిన్న పెద్దలతేడ వీసమ్ములేక
ప్రజల నందరిగూడ ఫాసిష్టుఖలులు
ఘోరహింసల కెల్ల గురిచేసినారు

ప్రజల పాలికి బ్రహ్మరాక్షసు లైన
హంతకాగ్రేసరుల్ యమభటాకృతులు
నాజీలు జపనీలు రోజురోజుకును
భారతావనిలోని ప్రజల నందరిని
రెచ్చగొట్టే బాగ రేడియోద్వార
నచ్చజెప్పీ తీయ ముచ్చుమాటలతొ
మభ్యపెట్టీ బోసు మంత్రాలతోడ
పరమ పావన మైన భారతావనిని

ఆక్రమించుటకొరకె మతిశ్రద్ధతోడ
శుభముహూర్తమునకై చూచుచున్నారు

పట్టుకొంటే వారు భారతావనిని
పరమసాధువులైన భరతపుత్రకులు
ఆబాలగోపాల మన్ని వర్గములు
దొంగలా ఫాసిష్టుదుష్టులు పెట్టు
యమయాతనలు తప్ప కనుభవించాలి
అందుచే మనమంత ఐక్యమౌదాము
మతజాతిభేదాలు మరచిపోదాము
వీరభారత పుత్రులార, మేల్కొండు
చైన రష్యాలలో జరుగు ఘోరాలు
ఒకసారి మదిలోన ఊహించుకొండి
కారకులైన ఆ క్రూరరాక్షసుల
ప్రజలందరికిగూడ పరమశత్రువుల
ఐక్యమై మనమంత అణచివేతాము
మనమంత ఒకటైతే మన కెవ్వరీడు?
దుష్టఫాసిష్టులకు దునుమాడగలము
కన్నతల్లిని ముందు కాపాడగలము

## ఫాసిస్టు దురంతాలు

పారతంత్ర్యము వేగ పరిమార్చగలము
స్వాతంత్ర్యలక్ష్మిని సాధించగలము
సర్వప్రజాస్వేచ్ఛ చవిచూడగలము
వీరభారత పుత్రులార, లేలెండు
జనని గాపాడగా జాగేల నింక?
జంకేల? కొంకేల? శంకేల మనకు?
రణరంగమున దూక రండు పోదాము

సెప్టెంబరు ౧౯౪౨

సోదరా

ఒక వైపు ఫాసిస్టు లోక వైపు ప్రజలంత
సర్వ శక్తులతోడ జయము సంపాదింప
పోరాడు చున్నారురా
సోదరా
పోరాడు చున్నారురా

ప్రజల స్వాతంత్ర్య సంపాదనార్థము నీవు
జనుల వైపున నిల్చి జయము సాధించగా
ఫాసిజము నెదిరించరా
సోదరా
ఫాసిజము నెదిరించరా

ప్రజల రక్తము త్రావు ఫాసిస్టు జపనీలు
ఇపుడు మనపై దూక నిదె వచ్చుచున్నారు
శౌర్యమును చవిచూపరా
సోదరా
శౌర్యమును చవిచూపరా

సో ద రా

గెల్చితే సత్కీర్తి నిల్చు శాశ్వతముగా
ఓడితే పరదాస్య పీడనము మన కింక
తర తరమ్ములకుండురా
సోదరా
తర తరమ్ముల కుండురా

భరత భూమిని నీవు పరులపాలొనరించి
పందవై పారితే ముందుతరముల ప్రజలు
దుమ్మెత్తి పోస్తారురా
సోదరా
దుమ్మెత్తి పోస్తారురా

జపనీలు వచ్చుచో స్వాతంత్ర్య మిత్తురని
పంచమాంగ దళాలు భ్రమపెట్టి ఊరించి
వంచించు చున్నారురా
సోదరా
వంచించు చున్నారురా

ఈ దుష్ప్రచారాల కీమాయమాటలకు
మోసపోవకయిట్టి మోసగాండ్రను బట్టి

చాటించి వెలి వేయరా
సోదరా
చాటించి వెలి వేయరా

ప్రజల మాడ్చు జపాను ఫాసిస్టు హంతకుల
పాలనకు లోనైతె భూలోక నరకమని
ముమ్మాటికిని నమ్మరా
సోదరా
ముమ్మాటికిని నమ్మరా

ఫాసిస్టులను ద్రుంప బద్ధకంకణు లౌచు
జనుల సేమమె గోరు చైన రష్యా ప్రజల
ఆదర్శ మెద నిల్పరా
సోదరా
ఆదర్శ మెద నిల్పరా

వేదకాలము నాటి వీర భారత కీర్తి
దిగ్దిగంతములందు తేజరిల్లుచు నుండె

## సోదరా

వెనుదిరిగి వీక్షించరా
సోదరా
వెనుదిరిగి వీక్షించరా

సర్వ దేశ ప్రజలు సఖ్య భావముతోడ
భరత శౌర్యము గాంచ వాంఛించుచున్నారు
కదన నైపుణి జూపరా
సోదరా
కదన నైపుణి జూపరా

జయము మనదే యంచు జయ పతాకము నెత్తి
జయగీతములు పాడి జయ జయ ధ్వనులతో
జయభేరి మ్రోగించరా
సోదరా
జయభేరి మ్రోగించరా

అక్టోబరు ౧౯౪౨

## ఐక్య ప్రభావం

మనమంత ఒకటైతే మన కేమి లెక్క ?
పదునాల్గు లోకాల నెదిరించ లేమ ?

అయిదారు వత్సరా లాత్మరక్షణ కొరకు
చైనీయ సోదరులు జాతీయ సేనతో
చచ్చినా బ్రతికినా జయమె లక్ష్య మటంచు
ఫాసిస్టు జపనీల పరిమార్చలేద ?
మనమంత ...

పదునాల్గు రాజ్యాల బలముతో నాజీలు
పైబడ్డ నెదిరించి ప్రాణ మాన ధనాలు
తృణముగా భావించు ఎర్రసైన్యము నేడు
ఫేసిస్టు కోరలన్ పెకలించలేద ?
మనమంత ...

ఆక్రాంతరూసులో అసమాన శక్తితో
గోరిలా దళములూ క్రూర నాజీసేన

## ఐక్య ప్రభావం

ముప్పాతిప్పలు పెట్టి మూడుచెరువుల నీళ్లు
త్రాగించి, వేటాడి, తరిమేయలేద?

మనమంత ...

చైన రష్యా ప్రజలు స్వార్థమునకే గాక
ప్రాపంచిక ప్రజల స్వాతంత్ర్యసిద్ధికై
వజ్ర సంకల్పులై ఫాసిస్టులను గూల్ప
ధర్మకంకణదీక్ష ధరియించలేద?

మనమంత ...

భరత వీరులు మున్ను బహు యుద్ధములలోన
విజయమో? స్వర్గమో? వేరొండు లేదంచు
శత్రునాశ మొనర్చి సాంద్ర కీర్తిద్యుతుల్
నలుదిక్కులను గూడ వెలయింపలేద?

మనమంత ఒకటైతె మన కేమిలెక్క?
పదునాల్గు లోకాల నెదిరించలేమ?

ఆక్టోబరు ౧౯౪౨

# స్వతంత్రయుద్ధం

స్వతంత్ర యుద్ధం స్వతంత్ర యుద్ధం
స్వతంత్ర యుద్ధం సాగింది

అనాహారముగ అహోరాత్రములు
బాధలు పడుతూ పరులకు దాస్యము
చేసీ చేసీ చివికి కృశించిన
బానిస జాతుల బంధము లూడ్చే

స్వతంత్ర ...

కాయకష్టమును చేయుటె కానీ
కూటికి గుడ్డకు కొదువై యుండే
కూలీ రైతులు కోరే రాజ్య
స్థాపన కొరకై ద్వారము తెరచే

స్వతంత్ర ...

చిన్న దేశముల చీల్చుకు తింటూ
జనులకు దాస్యపు సంకెళ్లేస్తూ

# స్వతంత్ర యుద్ధం

బీదల పీల్చి పిప్పిగ జేసే
ఫాసిజభూతము భస్మ మొనర్చే
స్వతంత్ర ...

దరిద్రదేవత తాండవ మాడే
ప్రపంచ మంతట ప్రజాప్రభుత్వం
సమస్త జనులకు శాంతిభద్రతలు
శాశ్వతసౌఖ్యం సంపాదించే
స్వతంత్ర ...

నిరంకుశత్వము నిర్మూలించే
కార్మిక కర్షక నిర్మల హృదిలో
నిగూఢతరముగ నిబిడీకృతమౌ
ప్రచండ శక్తిని ప్రకటింపించే

స్వతంత్ర యుద్ధం స్వతంత్ర యుద్ధం
స్వతంత్ర యుద్ధం సాగింది

ఆక్టోబరు ౧౯౪౨

యువకుడా

రణభేరి మ్రోగింది రావోయ్
యువకుడా
రణరంగమున దూక రావోయ్

ఫాసిష్టు జపనీయ బడబానల జ్వాల
మలయ, బర్మా మ్రింగి మన భరత భూమికే
బంగాళఖాతాన పరుగెత్తి వస్తుంది
ప్రళయ రుద్రునిభంగి భక్షించ వలెనోయ్
రణభేరి ...

నాజీల దావాగ్ని నలువైపులకు ప్రాకి
పలు దేశములు కాల్చి వల్లకాడుగ మార్చి
కాకసను మీదుగా గంతేయ చూస్తుంది
శౌర్య వర్షము గురిసి చల్లార్చవలెనోయ్
రణభేరి ...

మన జాతి రక్తమాంసాలతో దుర్భేద
హిమవన్నగముకంటె ఎంతో బలీయమా

ప్రాకారపాళి మన భారతావని చుట్టు
నిరుపమానమ్ముగా నిర్మించవలెనోయ్

రణభేరి ...

మన ఐకమత్యమే మన ప్రజాస్వాతంత్ర్య
భర్మహర్మ్యశ్రేణి నిర్మాణపు పునాది;
మన ఐకమత్యమే మానవ స్వాతంత్ర్య
శాంతిసుఖసంపదల్ సమకూర్చగలదోయ్

రణభేరి మ్రోగింది రావోయ్
యువకుడా
రణరంగమున దూక రావోయ్

అక్టోబరు ౧౯౪౭

## ప్రతిజ్ఞ

స్వాతంత్ర్య సమరమ్ము సాగింపలేమ?
ఫాసిస్టు భూతాల పరిమార్చలేమ?

మత జాతి భేదాలు మంటలో గలిపేసి
ఐకమత్యముతోడ ఐకకంఠ్యము తోడ
హిందు ముస్లిము లంద రేకమై నడువంగ

స్వాతంత్ర్య సమరమ్ము సాగింపలేమ?
ఫాసిస్టు భూతాల పరిమార్చలేమ?

అడుగడుగునకు గూడ అతి దుర్భరంబైన
ఆంక్ష బాధల నెన్నొ అనుభవించీ, విసిగి
నీచ సేవా నిగళ మోచనం బొనరింప

స్వాతంత్ర్య సమరమ్ము సాగింపలేమ?
ఫాసిస్టుభూతాల పరిమార్చలేమ?

అతిఘోర ఫాసిస్టు హత్యలకు గురియైన
ఆక్రాంత దేశాల ఆక్రందన ధ్వనుల్
వినివినీ, క్రోధాగ్ని విశ్వరూపము దాల్చ

## ప్ర తి జ్ఞ

స్వాతంత్ర్య సమరమ్ము సాగింపలేమ?
ఫాసిస్టు భూతాల పరిమార్చలేమ?

స్వాతంత్ర్యపరులైన సర్వదేశప్రజలు
ఆబాలగోపాల మన్ని జాతులుగూడ
అభ్యుదయ కాంతితో అండయై నిలువంగ

స్వాతంత్ర్య సమరమ్ము సాగింపలేమ?
ఫాసిస్టుభూతాల పరిమార్చలేమ?

అక్టోబరు ౧౯౪౨

## తారతమ్యం

అమృతము గ్రోలే నీ వేడా?
హాలహాల మానే నే నేడా?

ముద్దులుగుల్కే పూలతోటలో
మూడంతస్తుల మేడల లోపల
బంగారూయెల పాన్పున పండీ
నిర్విచారముగ నిదురించెదవోయ్!

అమృతము గ్రోలే నీ వేడా?
హాలహాల మానే నే నేడా?

ఎండకు వానకు ఎండే తడిసే
చిల్లులగుడిశలో చింపిచాపపై
కలియో, అంబలియో, గంజియొ త్రాగీ
నీరసహృదితో నిదురించెదనోయ్!

హాలహాళ మానే నే నేడా?
అమృతము గ్రోలే నీ వేడా?

## తారతమ్యం

వేళకు వచ్చి వేడి నీటితో
స్నానము చేసీ షడ్రసభోజన
సంతుష్టుడవై కాంతలగూడీ
ఆటల పాటల నానందించే
మధురస సేవివి నీ వేడా ?
విషరస పాయిని నే నేడా ?

రేయింబవలూ రెక్కలువిరుచుక
చాకిరి చేసీ నూకలు దెచ్చి
పిల్లా జెల్లకు పెట్టిన మిగలక
ఆకలిమంటల నాక్రందించే
విషరస పాయిని నే నేడా ?
మధురస సేవివి నీ వేడా ?

ఉషఃకాలమున ఉపవన వాటీ
పరిమళబంధుర పవనాంకురములు
మృదులశరీరము మెల్లగ తాకిన
నిర్భయంబుగా నిద్దుర లేచే
నీకూ నాకూ ఎక్కడిసామ్యం ?
మధురస సేవికి: విషరస పాయికి !

పెందలకడనే బెదరుచు లేచీ
తెల్లవారు నని తేపకు భయమున
జంకుచు గొంకుచు చల్దిి కుడువకే
పరుల కొలువుకై పరుగిడిపోయే
నాకూ నీకూ ఎంత విభేదం ?
విషరస పాయికి: మధురస సేవికి !

అమాయికప్రజ నన్యాయముగా
ఎన్నో బాధల కెరగావిస్తూ
పండిన పంటలు బండ చాకిరిని
దుర్మార్గముగా దోపిడిచేసే
నిరుపమ భోగివి నీ వేడా
నిరత త్యాగిని నే నేడా?

స్వార్థరహితముగ అనవరతంబును
ప్రజాక్షేమమే పరమార్థముగా
భావిస్తూ పలుబాధలు పడుతూ
స్థిరచిత్తముతో సేవ యొనర్చే
నిరత త్యాగిని నే నేడా?
నిరుపమ భోగివి నీ వేడా?

తారతమ్యం

స్వాతంత్ర్యప్రియ జాతుల నన్నీ
అస్త్రశస్త్రముల కాహుతిజేసీ
పశుబలమున పరిపాలించే ఫా
సిష్టు క్రూరులకు చేయూ తిస్తూ
అమృతము గ్రోలీ హాలహాల మొసగే
నీకూ
హాలహాల మానీ అమృతము గురిసే
నాకూ
ఎక్కడిసామ్యం? ఎంతవిభేదం?

స్వేచ్ఛారతిమై తుచ్ఛనియంతల
పోగరణచుటకై పోరుసల్పుతూ
సర్వప్రజలకు స్వాతంత్ర్యంబును
శాంతిసౌఖ్యములు సంపాదిస్తూ
హాలహాల మానీ అమృతము గురిసే.
నాకూ
అమృతము గ్రోలీ హాలహాల మొసగే
నీకూ
ఎంతవిభేదం? ఎంతటిదూరం?

ప్రజాప్రభుత్వం భస్మంచేస్తూ
ప్రపంచశాంతిని భగ్నంచేస్తూ
నిరంకుశంగా నిర్దేశించే
నియంత హిట్లరు నిరతముగొలిచే
హాలహాల మొసగే నీ వేడా?
అమృతము గురిసే నే నేడా?

ప్రజాప్రభుత్వం ప్రవృద్ధిచేస్తూ
ప్రపంచశాంతిని ప్రబలంచేస్తూ
నిరంకుశత్వము నిర్మూలించే
స్టాలిను అడుగుల జాడల నడిచే
అమృతము గురిసే నే నేడా?
హాలహాల మొసగే నీ వేడా?

రైలుతీగెలును, రైళ్ళువగైరా
నాశముచేస్తూ దేశ రక్షణకు
విఘ్నముమొనర్చుచు భీకరజాపుల
దండయాత్రలకు తలుపులు తీసే
విషరసదాయివి నీ వేడా ?
మధురసదాయిని నే నేడా

## తారతమ్యం

గవర్నమెంటుకు కాంగ్రెసువారికి
నడుమను నిల్చి నానాహింసల
కెరయై బెదరక భరత నాయకుల
జైలు విమోచన సాధనకొరకై
స్వదేశ రక్షణ సాగించుటకై
జాతీయైక్యము సంపాదిస్తూ
స్వాతంత్ర్యముకై ప్రాణమొసంగే
మధురస దాయిని నే నేడా?
విషరస దాయివి నీ వేడా?

నవంబరు ౧౯౪౨

## సోదరీ

శౌర్య సంపన్నలౌ
చైన రష్యా స్త్రీల
వీర గాథలు విన్నచో
సోదరీ
విస్మయము జనియించదా ?

మాతృ దేశము కొరకు
మగవారితో పాటు
పోరు సల్పుట చూచితే
సోదరీ
వీరత్వ ముప్పొంగదా ?

అన్ని రంగాలలో
ఆరితేరి వారు
పురుషులకు సరిదీటిగా
సోదరీ
ముందంజ వేయలేదా?

## సోదరీ

తమ దేశముల పైకి
దండయాత్రలు సేయు
ఫాసిష్టు పాపాత్ములన్
సోదరీ
భస్మ మొనరించలేదా?

వీర వనిత లటంచు
విశ్వ మంతట గూడ
రణ చాతురీ రీతిచే
సోదరీ
ప్రఖ్యాతి గాంచలేదా?

దేశభక్తి యటన్న
దివ్యౌషధము వారి
అణు వణువులో జీర్ణమై
సోదరీ
ఐక్య మొనగూర్చలేదా?

అట్టి ఆదర్శమే
గట్టిగా మది నిల్పి

విప్లవజ్వాల

భరతభూవి గాపాడగా
సోదరీ
ప్రతిన వేగమె బూనుమా

హంతకులు ఫాసిస్టు
లాక్రమించిన యెడల
భారతీయుల బాధలన్
సోదరీ
నోరు రాదు వచింపగా

అందులో ముఖ్యముగ
ఆడుజాతికి పట్టు
అనుపమాన దురంతముల్
సోదరీ
ఆత్మలో దలపోయుమా

కఠిన ఫాసిస్టు లా
క్రమిత దేశస్త్రీల
మానాభిమానమ్ములన్
సోదరీ
మంట గలిపేయలేదా?

## సోదరి

తల్లి ఏడ్చుచు నుండ
తన బిడ్డల వధించు
ఘోర హత్యలు చూచితే
సోదరీ
గుండె నీరయి పోవదా?

ఈ యమానుషఘోర
కృత్యాలు భరతభువి
జరుగకుండుట కోసమై
సోదరీ
శత్రువుల నెదిరించుమా

భారతావనిలోని
వీర నారీ శక్తి
చాటుటకునీ సమయమే
సోదరీ
గీటురాయని యెంచుమా

ఝాన్సిలక్ష్మిబాయి
చరితమ్ము స్మరియించి

పూర్వ మహిళౌన్నత్యముఁ
సోదరీ
నిర్వహింప గడంగుమా

సంఖ్యా బలములోన
సమభాగ మగుటచే
సమముగా మగవారితో
సోదరీ
సమరభారము పూనుమా

అబల లం చను నామ
మర్థరహిత మొనర్చి
సమర నై పుణ్యమ్ముచే
సోదరీ
సబల లం చని చాటుమా

నవంబరు ౧౯౪౭

## ప్రబోధం

లేరా! రారా! మాంద్యము వీడర!
భారత వీర కుమారా!

భారత భువిలో బాంబుల వర్షం
జోరున పడుచున్నదిరా
అగ్ని జ్వాలలు అమాయిక ప్రజ
నాహుతి గొనుచున్నవిరా
లేరా! ...

బాంబుల మంటలు పైపై కెగసీ
పది దిక్కుల ప్రాకునురా
అందుచేత మన మందర మొకటై
ఆర్పగ బోదము రారా
లేరా! ...

ఫాసిజ భూతము ప్రజల వధింపగ
పరుగిడు చిటె వచ్చెనురా
లొంగి సలాములు వంగి చేసినా
మ్రింగక నిను విడువదురా
లేరా! ...

అక్కలు చెల్లెం డ్రాలు బిడ్డలకు
అవమానము వాటిలురా

ఆస్తిపాస్తులకు అన్నిటి కిపుడే
ఆపదలిక తప్పవురా
లేరా! ...

అదరుచు బెదరుచు అటు ఇటుచూస్తూ
ఔదాసీన్య మదేలా ?
నిస్తంద్రతమై నిస్తుల తేజము
నెరపగ వేగమె రారా
లేరా ! ...

స్వదేశ రక్షణ సాధన కొరకై
శత్రువు నెదిరించుమురా
ఫాసిజ శక్తికి భారత వర్షమె
బలివేదికగా నగురా
లేరా ! ...

భారతదేశ స్వరాజ్య సిద్ధికి
ప్రాణము లర్పించుమురా
స్వాతంత్ర్యంబే సకల సుఖంబుల
నమకూర్చుట తథ్యమురా
లేరా ! ...

నవంబరు ౧౯౪౭

## స్వ ర ము లు

0 ఈగుర్తుగల స్వరాలన్నీ కోమలములు.

0
రి - శుద్ధము

0
గ - సాధారణము

0
ద - శుద్ధము

0
ని - కైశికి

### ౧. మధ్యమావతి - చతుశ్ర - ఏక.

| | | | |
|---|---|---|---|
| ప్రపంచ | యుద్ధం | ప్రపంచ | యుద్ధం |
| ప సా సా | సా సా | ప ని ని (0 0) | ప మ రీ |
| తుపాను | వలెచెల | రేగిం | దోయ్ |
| రి మా మ | మమమమ | పనిపమ (0) | రి స స్తా |
| ఇటలీ | జర్మని | అటువై | పునమా |
| రి మ మా | మా రి స | రి మ మా | పా ప ప |

బ్రిటిష్ప్ర భుత్వం ఇటువై పునసా
ప ని ని నీ ని ప ప ని ని స సా సా

ప్రపంచ యుద్ధం బ్రహ్మాం డముగా
స రి రి రి రి రి మ రి మ రి సా

సామ్రా జ్యాలతో సాగిం దోయ్
స రి రీ రి రి స ని స స రి రీ

సామ్రా జ్యాలను సాగిం దోయ్.
స రి రి స స ని ని ప ప ని ని ని సా

౨. శ్రీరాగం - త్రిశ్ర - ఏక.

కాలమిదే లెండికర్ కార్మికక ర్షకులార
సా స స సా స ని ని పా పా ప ప పా ప ని ని ప మ రి

బానిసత్వ మిప్పుడే బాపుకో శక్తిలేదె
రీ మ మా రి రి మ ప నీ ని స ని పా మ రి మ మ రీ స

## స్వరములు

కాలమిదే  లెండికర్క  కార్మికక  ర్షకులార

0 0  0 0
సా సస సా  సి ని ని పా  పా ప ప పా  ప ని ని ప మరి

పెట్టుబడివి  ధానమిటుల  పీల్చిపిప్పి  జేసెమిమ్ము

స సా స స స స  రి మ మ మా మ  రి మ మ మా రి  రి మ ప పా ప

ఎంతకాల  మింకమీరు  హేయమైన  జీవితమ్ము

0  0 0 0 0  0 0 0
మ ప ప పా ని  ని ని ని ని  ని ని ని సా సి  సా సి సా సి

గడపగలరు  మీదుహక్కు లడుగ వేగ  రండురండు

0  0 0  0
రి రి రి రీ రి  రీ గి రి రి సి  సి రి సి ని ని  సి సి నిపమప

## 3. మిశ్రదేశి – ఆది.

అదిగో  అదిగో  అరుణప  తాకం

2
ధ స సా  . . సా  రి మ గ రి  రీ రి

ప్రపంచ  కార్మిక  భాగ్యని  ధానం

స రీ మా  మా మ రి  మ పా ప  పా పా

## వి ప్ల వ జ్వా ల

| | | | |
|---|---|---|---|
| సు_త్రీ | కొ°డవలి | సుచిహ్నా | దీ_ప్తం |
| దా దా | ద $\overset{0}{\text{ని}}$ ద ప | మ పా ప | పా పా |
| అదిగో | అదిగో | అదిగో | అదిగో |
| ద సీ $\overset{14}{\text{సా}}$ | ప ద $\overset{14}{\text{దా}}$ | మ ప $\overset{14}{\text{వా}}$ | రిమమరిసా |
| అదిగో | అదిగో | అరుణప | తాకం |
| ధ స సా | ధ స్మ సా | రి $\overset{0}{\text{మ}}$ గ రి | రీ రీ |
| కనపడ | లేదా | కనుల | పండువుగ |
| ద ద ద ద | దా ద ప | మ ప ప | పా ప ప |
| అరుణప | తాకవు | టడుగున | నిలిచీ |
| ద ద ద ద | ద సీ ద ప | మ ప ప ప | ప ప పా |
| నాజీ | రాక్షసి | నాడిస | డల్చుచు |
| ద ద ద ద | దా ద ప | మ ప ప ప | పా ప ప |
| జనులస్వ | తంత్రత | సంర | క్షించే |
| ద ద ద ద | ద సీ ద ప | మ ప ప ప | పి ప పా |

స్వరములు

| | | | |
|---|---|---|---|
| ఎర్రనై | న్యమదె | ఎగురుచు | పాడుచు |
| దా ద దా | ద ద ద | ద సీ ద ప | పా ప ప |
| కనపడ | లేదా | కనపడ | లేదా |
| ద సీ ద సీ | సాం సాం | ప ద ప ద | దా దా |
| కనపడ | లేదా | కనపడ | లేదా |
| మ ప మ ప | పా పా | రి మ రి మ | రి స దా సా |
| అదిగో | అదిగో | అరుణప | తాకం |
| ద స సా | ద స సా | రి మ గ రి | రీ రీ |

## ౮. శుద్ధసావేరి - మిశ్ర - ఏక.

| | | | |
|---|---|---|---|
| భరత | పుత్రుల | వీర | గాథలు |
| సాం సి | సాం సి సి | రీ సి | ద ప మా |
| మరచి | నారా | లెండు | లెండోయ్ |
| మ మ మ | మ ప ప ద | ద సి సి | సాం సాం |

| | | | |
|---|---|---|---|
| చావ | లేదోయ్ | భార | తీయుల |
| ద సి సి | ద సి రి సి దా | ద సి ద | ప మ గీ |

| | | |
|---|---|---|
| శౌర్య | ధైర్యము | లు |
| | | 7 |
| రి మ రి | సా రి ధ | సా |

| | | | |
|---|---|---|---|
| ఉడుకు | రక్తము | పొంగి | పొరలును |
| ద ప ద | దా ప మ | ప ద సి | ద సి సా |

| | | | |
|---|---|---|---|
| ఒడలు | వడివడి | కంప | మెత్తును |
| సి రి రి | రి రి రి | రి మ రి | మ రి సా |

| | | | |
|---|---|---|---|
| ఝాన్సి | లక్ష్మి | బాయి | చరితము |
| రి రి | రి రి ద | సా సి | సి సి సా |

| | | |
|---|---|---|
| జ్ఞప్తి | వారిన | చో |
| | | 7 |
| ద సి ద | పా మ ప | దా |

## ౫. శంకరాభరణం - ఆది.

| | | | |
|---|---|---|---|
| వ్రాతల | చేతల | బట్టే | లోకం |
| గా గ గ | గ మ గ రి | రి గ రి స | స రి స ని |

స్వరములు

| | | | |
|---|---|---|---|
| పార్టీ | తత్వం | పరికి | స్తుందోయ్ |
| ఫ స సా | స రి రీ | గ మ గ రి | గ రి సా |
| ఫాసిజ | మేమును | ప్రతిఘటి | యిస్తాం |
| గ మ గ ప | పా ప ప | గ మ ప ద | ప మ పా |
| స్వరాజ్య | మేమును | సంపా | దిస్తాం |
| గ మ మ ప | పా ప ప | గ మ ప ద | ప మ పా |

౬. మోహన - మిశ్ర - ఏక.

| | |
|---|---|
| స్వచ్ఛమౌ జా | తీయసంస్థను |
| సా సి సా ద సి | సా ని సా సా |
| తుచ్ఛులౌ సా | మ్రాజ్యవాదులు |
| రీ రి రీ సి రి | రీ సి దా ద ప |
| రెచ్చగొట్టీ | దేశమంతట |
| గా ప పా దా | ద సి ద పా ప గ |
| చిచ్చుబెట్టా | రు |
| రీ రి రీ గ రి | సా |

## విప్లవజ్వాల

దీనిచేను ద్రేకపూరితు
గా గ గ రి గ ప పా ప పా ప గ

లైనమనజా తీయవాదులు
గ ప ద ద ద ప ద సీ ద సీ సాం సీ సీ

దొంగదెబ్బకు తారుమారై
రి రి రి రి రి సీ గ రి సాం దా

లొంగిపోయా రు
ద సీ ద ప గ ప ద 7 సాం

## ౭. దసరా గీతాల మాదిరి.

### ౮. మోహన - జంపె.

ఒకవైపు ఫాసిస్టు లోకవైపు ప్రజలంత
దసీసాసీ సాసీసీసీ దసీసీదప దసీసాసి

సర్వశక్తుల తోడ జయము సంపాదింప
రిరిరిరిరి రి రి రి రి రి రిగగరిసాసా

స్వరములు

పోరాడు చున్నారు రా సోదరా·
దసీసాసి సీదదపగ గపదసా సీదపగా

పోరాడు చున్నారురా
10
గపగదప గారిగ స్తా

ప్రజలస్వా తంత్ర్యసం పాదనా రమునీవు
గగగగప గాగగప దాదదా దదదాద

జనులవై పునసిల్చి జయముసా ధించగా
దదదదసీ సీదపాప పదసీదసీ సాసీసా

ఫాసిజము నెదిరించరా సోదరా
రిరిరిరి రిరిరీరిగా గారిసీద

ఫాసిజము నెదిరించరా
10
సా సీసీద దపపగపసా

౯. కేదార - ఝంపె.

మనమంత ఒకటైతె మనకేమి లెక్క
3
గగగాగ గమరిరి రిగగరిస సరిపా·

పదునాల్గు లోకాల నెదిరించ లేమ
ద ని సా ప పప దాగ రిరి రీ గ రీ సా

అయిదారు వత్సరా లాత్మర క్షణకొరకు
పాపాప పాదపా పాదపా పాపపా

చైనీయ సోదరులు జాతీయ సేనతో
పదదాద ద పమరిస స రిమరిమ మామమా

చచ్చినా బ్రతికినా జయమెల క్ష్యమటంచు
మపపపమ పదదద ప దదదమప పపపాప

ఫాసిష్టు జపనీల పరిమార్చ లేద
దనిదనిద పదపదగ రిరీగ రీసా

## ౧౦. హిం - భైరవి.

స్వతంత్ర యుద్ధం స్వతంత్ర యుద్ధం
సమామ మామా మపాప పమగా

స్వతంత్ర యుద్ధం సాగింది
గ రీస స రిగా గరి రీ సా

స్వ ర ము లు

| | | | |
|---|---|---|---|
| అనాహా | రముగ | అహోరా | త్రములు |
| | | 000 | 00 |
| ప సా సా | సిసిసి | ని నిని | దదపమ |
| బాధలు | పడుతూ | పరులకు | దాస్యము |
| | 00 | 000 | |
| మపపమ | ప దని | ద నిదప | మపపా |
| చేసీ చేసీ | | చివికికృ | శించిన |
| 0 0 0 | | 000 | |
| దగి గాసిరిగిసి | | సి రిగిరి | సాసిసి |
| బానిస | జాతుల | బంధము | లూడ్చె |
| 00 | 00 | 0 | 0 0 4 |
| సిగిరిసి | ని దపా | పదపమ | గ రిస్సా |

## ౧౧. మిశ్రముఖారి – జంపె.

| | | | |
|---|---|---|---|
| రణ భేరి | మ్రోగింది | రావోయ్ | యువకుడా |
| | | 3 | |
| స ధ ధ స స | సా సా స | దా దా | ద ప మ గ రి |
| రణరంగ | మునదూక | రావోయ్ | |
| 0 | 0 | 10 | |
| రి రి రీ గ | రి స రీ గ | రీ సా | |

విప్లవజ్వాల

| | | | |
|---|---|---|---|
| ఫాసిస్టు | జపనీయ | బడబాన | లజ్వాల |
| పా పా ప | పమగరిస | సరిరీగ | రిస సా స |
| మలయబ | ర్మాక్రమింగి | మనభరత | భూమికే |
| రిమమపద | నిదపమమ | మపదసిద | సాసిసిద |
| బంగాళ | ఖాతాన | పరుగెత్తి | వస్తుంది |
| దసిరిమగి | రీరీరి | రిగిరీగి | రిసిసాధ |
| ప్రళయరు | ద్రునిభంగి | భక్షించ | వలెనోయ్ |
| దసిరిసిరి | సినిదపప | మపపదప | మగరిసా |

## ౧౨. శ్రీరాగము – జంపె.

| | | | |
|---|---|---|---|
| స్వాతంత్ర్య | సమరమ్ము | సాగింప | లేమ |
| సాసాసి | సినినిపప | పనిపమరి | రిమపని |
| ఫాసిస్టు | భూతాల | పరిమార్చ | లేమ |
| రిమమామ | రిమపనిప | మపమరిస | రినిసా |

స్వ ర ము లు

| | | | |
|---|---|---|---|
| మతజాతి | భేదాలు | మంటలో | గలిపేసి |
| మ ప మ ప మ | రి మ రి మ రి | స రి రి రి ని | ని స స్ సా స |
| ఐకమ | త్యముతోడ | ఐక కం | ఠ్యముతోడ |
| రి మ మ ప ని | ని ని ని ప | ప ని ని ని సే | సా సే సా |
| హిందుము | స్లిములంద | రేకమై | నడువంగ |
| రీ రి రీ | రి గ రి సె సె | సె రి సె సె ని | ప ని ప మ ప |

## ౧౩. మిశ్రభైరవి - చతురశ్ర - ఏక.

| | | | |
|---|---|---|---|
| అమృతము | గ్రోలే | నీ వే | డా |
| పదస ని | దాపమ | గాగరిసరి | గా |
| హాలహాల | మానే | నేనే | డా |
| సగగగ | సగమపమగసా | సని ధని | సా |
| ముద్దులు | గుల్కే | పూల | తోటలో |
| దాదద | పదమా | పాద | పదసానిసా |

| | | | |
|---|---|---|---|
| మూడం | తస్తుల | మేడల | లోపల |
| | | 00 | 00 |
| సాసా | సిసిసా | సిగరిసి | రినిసా |
| బంగా | రూయెల | పాన్పున | పండీ |
| 0 | 0 00 | 0 0 | 0 |
| సాగా | గాగగ | సగమగ | సగసాని |
| నిర్వి | చారముగ | నిదురిం | చెదవోయ్ |
| 00 | 0 0 | 0 0 | 0 |
| నినిస | గారిసా | సరిసని | దపమా |

## ౧౮. ఉదయరవిచంద్రిక – జంపె.

| | | | |
|---|---|---|---|
| శౌర్య సం | పన్నలౌ | చైనర | ష్యాస్త్రీల |
| సా స సా | సా స సా | సా స సా | నీ నీ ని |
| వీరగా | థలువిన్న | చో | సోదరీ. |
| 00 | 0 | 5 | 0 |
| ని స స గ గ | స స స గ మ | పా | పా ప గా |
| విస్మయము | జనియించ | దా | |
| 0 | 0 | 10 | |
| గా మ ప మ | ప మ గ స ని | సా | |

స్వ ర ము లు

| | | | |
|---|---|---|---|
| మాతృ దే | శముకొరకు | మగవారి తోపాటు | |
| 0 | | 0 0 0 0 | |
| పా ప ప ని | పా ప పా | మ ప ప మ గ గ మ మ గ గ | |
| పౌరుస | ల్పూటచూచి | తే | సోదరీ |
| 0 0 | 0 0 0 | 10 | 0 0 |
| గ మ మ ప ని | ని ప ప ని ని | సా | ని రి సి ని ప |
| వీరత్వ | ముప్పొంగ | దా | సోదరీ |
| 0 | 0 0 | 5 | 0 |
| ప ని పా ప | మ గ సా గ | పా | పా ప గా |
| వీరత్వ | ముప్పొంగ | దా | |
| 0 | 0 | 10 | |
| గా మ ప మ | ప మ గ స ని | సా | |

## ౧౫. మాండ్ - ఆది.

| | | | |
|---|---|---|---|
| లేరా | రారా | మాంద్యము | వీడర |
| నిని | సనినిదప | దసససస | సా నిసరిరిసరిసా |
| భారత | వీరకు | మారా | |
| నినిస | నిదపద | గమపద పా | |

# విప్లవ జ్వాల

భారత భువిలో బాంబుల వర్షం
మామమ మమరీ పాపప పదమా

జోరున పడుచు న్నదిరా
నీనిని నిసనిదపాద నిసరినిసా [6]

అఅఅఅఅఅఅఅ
పదస రిగసరిగా

అగ్ని జ్వాలలు అమాయి కప్రజ
గాగగ గాగరిసా రీరిరి రీరిసని

నాహుతి గొనుచు న్నవిరా
నీనిని నిసనిదపాదా [2] సససా [10]

